# అథ అష్టావింశో%ధ్యాయః

# జగత్తు అగ్నిషోమాత్మకము

ఋషయ ఊచుః |

దేవీం సమాదధానేన దేవేనేదం కిమీరితమ్ | అగ్నిషోమాత్మకం విశ్వం వాగర్థాత్మకమిత్యపి || 1

ఆజ్ఞైకసారమైశ్వర్యమాజ్ఞా త్వమితి చోదితమ్ | తదిదం శ్రోతుమిచ్ఛామో యథావదనుపూర్వశః || 2

ఋషులు ఇట్లు పలికిరి -

దేవికి సమాధానమును చెప్తూ శివుడు చెప్పిన మాటలకు అర్థమేమి? జగత్తు అగ్ని మరియు సోముని స్వరూపమేననియు, జగత్తు కేవలము నామరూపాత్మకము మాత్రమే ననియు, ఆజ్ఞాపించే సామర్థ్యమే ఈశ్వరత్వముయొక్క సారభూతమైన లక్షణము కాగా అట్టి ఆజ్ఞ నీవేననియు శివుడు చెప్పియున్నాడు. వీటి యర్థమును మేము యథాతథముగా అదే వరుసలో వినగోరుచున్నాము (1,2).

అగ్నిరిత్యుచ్యతే రౌద్రీ ఘోరా యా తైజసీ తనుః | సోమశ్శాక్తో%మృతమయశ్శక్తేశ్శాంతికరీ తనుః || 3

అమృతం యత్ప్రతిష్ఠా సా తేజో విద్యాకలా స్వయమ్ | భూతసూక్ష్మేషు సర్వేషు త ఏవ రసతేజసీ ||

ద్వివిధా తేజసో వృత్తిస్సూర్యాత్మా చానలాత్మికా | తథైవ రసవృత్తిశ్చ సోమాత్మా చ జలాత్మికా || 5

విద్యుదాదిమయం తేజో మధురాదిమయో రసః | తేజోరసవిభేదైస్తు ధృతమేతచ్చరాచరమ్ || 6

ఆగ్నేరమృతనిష్పత్తిరమృతేనాగ్నిరేధతే | అత ఏవ హి విక్రాంతమగ్నిషోమం జగద్ధితమ్ || 7

హవిషే సస్యసంపత్తిర్వృష్టిస్సస్యాభివృద్ధయే | వృష్టేరేవ హవిస్తస్మాదగ్నిషోమధృతం జగత్ || 8

అగ్నిరూర్ధ్వం జ్వలత్యేష యావత్సౌమ్యం పరామృతమ్ | యావదగ్న్యాస్పదం సౌమ్యమమృతం చ స్రవత్యధః || 9

అత ఏవ హి కాలాగ్నిరధస్తాచ్ఛక్తిరూర్ధ్వతః |యావదాదహనం చోర్ధ్వ మధశ్చాప్లావనం భ##వేత్ || 10

ఆధారశ##క్త్యైవ ధృతః కాలాగ్నిరయమూర్ధ్వగః | తథైవ నిమ్నగస్సోమశ్శివశక్తిపదాస్పదః || 11

శివశ్చోర్ధ్వశ్శక్తిరూర్ధ్వం శక్తిరధశ్శివః | తదిత్థం శివశక్తిభ్యాం నావ్యాప్తమిహ కించన || 12

వాయువు ఇట్లు పలికెను -

రుద్రుని తేజోమయమైన దేహమునకు అగ్నియని పేరు. శక్తియొక్క అమృతమయము మరియు శాంతికరము అగు దేహమే సోముడు (3). ప్రతిష్ఠాకళ##యే అమృతము. విద్యాకళ స్వయముగా తేజస్సే. భూతసూక్ష్మములన్నింటిలో గల రసము మరియు తేజస్సు క్రమముగా అవియే(4). సూర్యుడు, అగ్ని అనే రెండు రూపములలో తేజస్సు ప్రకటమగుచున్నది. అదే విధముగా రసము కూడా చంద్రుడు, నీరు అనే రెండు రూపములలో ప్రకటమగుచున్నది (5). తేజస్సు మెరుపు మొదలగు రూపములలో నుండగా, రసము తీపి మొదలగు రూపములలో నున్నది. ఈ చరాచరజగత్తు అంతయు ఈ తేజస్సు, రసము అను వాటిలో గల విభిన్న రూపములచే మాత్రమే ధరించబడి యున్నది (6). అగ్నినుండి అమృతము పుట్టును. అమృతము వలన అగ్ని వర్ధిల్లును. కావున, ఈ విధముగా విస్తరించియున్న అగ్ని మరియు సోములే జగత్తునకు హితమును

చేయుచున్నారు (7). పంటలు బాగుగా పండినచో, హవిస్సు లభించును. వర్షముల వలన పంటలు వర్ధిల్లును. అనగా, వర్షమునుండియే హవిస్సు, పుట్టుచున్నది. ఈ విధముగా జగత్తును అగ్ని మరియు సోముడు మాత్రమే ధరించియున్నారు (8). ఈ అగ్ని పైన సోముని సర్వోత్కృష్టమగు అమృతస్థానము వరకు ప్రజ్వరిల్లును. సోముని అమృతము అగ్నికి ఆధారమగు పృథివీ లోకము వరకు క్రిందకు స్రవించును (9). అందువలననే, కాలాగ్ని,క్రింద, శక్తి పైన గలవు. అగ్నియొక్క గతి పైకి, జలము యొక్క గతి క్రిందకు ఉండును (10).పైకి జ్వలించే ఈ కాలాగ్నిని మూలాధారమునందలి శక్తి ధరించి యున్నది. అదే విధముగా, శివశక్తిస్థానమగు సహస్రారమునుండి సోముని కిరణములు క్రిందకు ప్రవహించును (11). శివుడు పైన ఉండగా, శక్తి క్రింద ఉన్నది. శక్తి పైన ఉండగా, శివుడు క్రింద ఉన్నాడు. ఈ విధముగా ఈ జగత్తులో శివశక్తులచే వ్యాప్తము కానిది ఏదీ లేదు. (12)

అసకృచ్చాగ్నినా దగ్ధం జగద్యద్భస్మసాత్కృతమ్ | అగ్నేర్వీర్యమిదం చాహుస్తద్వీర్యం భస్మ యత్తతః || 13

యశ్చేత్థం భస్మసద్భావం జ్ఞాత్వా స్నాతి చ భస్మనా | అగ్నిరిత్యాదిభిర్మంత్రై ర్బద్ధః పాశాత్ర్ప ముచ్యతే || 14

అగ్నేర్వీర్యం తు యద్భస్మ సోమేనాప్లావితం పునః | అయోగయుక్త్యా ప్రకృతేరధికారాయ కల్పతే || 15

యోగయుక్త్యా తు తద్భస్మ ప్లావ్యమానం సమంతత ః |
శాక్తేనామృతవర్షేణ చాధికారాన్నివర్తయేత్ || 16

అతో మృత్యుంజయాయేత్థమమృతప్లానవం సదా |
శివశక్త్యమృతస్పర్శే లబ్ధం యేన కుతో మృతిః || 17

యో వేద దహనం గహ్యం ప్లావనం చ యథోదితమ్ | అగ్నిషోమపదం హిత్వా నస భూయో%భిజాయతే || 18

శివాగ్నినా తనుం దగ్ధ్వా శక్తిసౌమ్యామృతేన యః | ప్లావయేద్యోగమార్గేణ సో%మృతత్వాయ కల్పతే || 19

హృది కృత్వే మమర్థం వై దేవేన సముదాహృతమ్ |
అగ్నిషోమాత్మకం విశ్వం జగదిత్యనురూపతః || 20

ఇతి శ్రీ శివమహాపురాణ వాయవీయసంహితాయాం పూర్వఖండే అగ్నిషోమాత్మక జగద్వర్ణనం నామ అష్టావింశో%ధ్యాయః (28).

జగత్తులో సాధారణముగా అగ్నిచే అధికముగా తగులబెట్టబటిన వస్తువు భస్మమగును. కావున, భస్మ అగ్నియొక్క శక్తి గనుక, దానికి అగ్ని వీర్యమని పేరు గలదని చెప్పెదరు (13). ఎవడైతే ఈ విధముగా భస్మయొక్క మహిమను యెరింగి, అగ్నిరితి భస్మ మొదలగు మంత్రములతో భస్మస్నానమును చేయునో, అనగా దేహమంతయ భస్మను ధరించునో, అట్టివాడు బంధములో నున్నచో, ఆ పాశమునుండి విముక్తుడగును (14). అగ్నియొక్క శక్తియగు భస్మ సోమునిచే తడుపబడినచో, అనగా వెన్నెల తగిలినచో, అది అష్టాంగయోగ సాధనలు లేకుండగనే ప్రకృతిశక్తులపై అధికారమును సాధకునకు ఈయగలదు (15). శక్తిమయమగు అమృతవర్షముచే పూర్ణ ముగా తడుపబడిన ఆ భస్మ యోగసాధనలతో గూడి సాధకుని ప్రకృతిశక్తుల అధికారమునకు అతీతుని చేయును (?16). కావున, సర్వకాలములలో ఈ విధముగా అమృతస్పర్శను పొందిన భస్మ మరణముపై విజయమును సంపాదించి పెట్టగలదు. శివశక్తుల అమృతమయమగు స్పర్శను పొందిన వానికి మృత్యువు ఎక్కడిది? (17). ఎవడైతే పైన చెప్పబడిన విధముగా రహస్యమగు అగ్నివీర్య- అమృతస్పర్శలను గురించి తెలుసుకొనునో, అట్టివానికి అగ్నిషోమాత్మకమగు జగత్తునుండి విముక్తి కలగును. వానికి, పునర్జన్మ గాని ఉండదు (18). ఎవడైతే శివస్వరూపమగు అగ్నితో శరీరమును దహించి, అనగా భస్మను ధరించి, శక్తిమయమగు సోముని అమృతముతో దానిని యోగమార్గములో తడుపునో, అనగా

శక్తిస్వరూపమగుఆజ్ఞాచక్రమునందలి చంద్రుని నుండి స్రవించే అమృతమును సేవించునో, అట్టివాడు మోక్షమునకు అర్హుడగును (19). ఈ విషయమును మనసులో నిడుకొనియే, జగత్తు అంతయు అగ్ని మరియు సోముల స్వరూపమేనని శివుడు యుక్తియుక్తముగా చెప్పియున్నాడు (20).

శ్రీశివమహాపురాణములోని వాయవీయసంహితయందు పూర్వఖండములో జగత్తుయొక్క అగ్నీ షోమాత్మకస్వరూపమును వర్ణించే ఇరువది యెనిమిదవ అధ్యాయము ముగిసినది (28).